# గాయత్రీ మహా మంత్రము

ఋషి : విశ్వామిత్రుడు — దేవత : సవిత

ఛందస్సు : గాయత్రీ — స్వరము : షడ్జః

[illegible]

[illegible]

(ఋ. 3-62-10; యజు. 3-35, 22-9, 30-2, 36-3; సామ. 1462; అనేక సంహితా బ్రాహ్మణ ఆరణ్యకములు)

[illegible] : హే రక్షక! సచ్చిదానంద స్వరూప! జగదుత్పాదక దేవ! నీ దివ్యగుణయుక్తము వరేణ్యము నగు శుద్ధ విజ్ఞాన స్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము గాక! నీవు మాకు సద్బుద్ధినిచ్చి సత్కర్మలాచరించునట్లు ప్రేరేపింతువుగాక!

(అనుష్ఠానము మూడవ అట్టపైన)

# ప్రణవ స్తోత్రమ్

(అష్టోత్తర శతనామావళి - అర్థసహితమ్)

గాయత్రీ గ్రంథమాల - 28
బహుధాన్య సంక్రాంతి
(జనవరి - 1999)
చతుర్థ ముద్రణ ప్రతులు : 10000

మూల్యము : రూ. 2=50 (చిన్నవి)
(ప్రచారార్థము ప్రత్యేక తగ్గింపు ధర)

సంస్కృత మూలం : స్వర్గీయ పండిత విశ్వామిత్రజీ

వ్యాఖ్యాత : సంధ్యావందనం శ్రీనివాసరావు

ప్రకాశకులు :
**గాయత్రీ ఆశ్రమ ప్రచురణ**



# గాయత్రీ మహా మంత్రము

ఋషి : విశ్వామిత్రుడు | దేవత : సవిత

ఛందస్సు : గాయత్రీ | స్వరము : షడ్జః

ఓ౩మ్ భూర్భువః స్వః, తత్సవితుర్వరేణ్యమ్ ।
భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్ ॥

(ఋ. 3-62-10; యజు. 3-35, 22-9, 30-2, 36-3; సామ. 1462; అనేక సంహితా బ్రాహ్మణ ఆరణ్యకములు)

భావార్థము : హే రక్షక! సచ్చిదానంద స్వరూప! జగదుత్పాదక దేవ! నీ దివ్యగుణయుక్తము వరేణ్యము నగు శుద్ధ విజ్ఞాన స్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము గాక! నీవు మాకు సద్బుద్ధినిచ్చి సత్కర్మలాచరించునట్లు ప్రేరేపింతువుగాక!

(అనుష్ఠానము మూడవ అట్టపైన)

# ప్రణవ స్తోత్రమ్

## (అష్టోత్తర శతనామావళి - అర్థసహితమ్)

గాయత్రీ గ్రంథమాల - 28
బహుధాన్య సంక్రాంతి
(జనవరి - 1999)
చతుర్థ ముద్రణ ప్రతులు : 10000

మూల్యము : **రూ. 2=50** (చిన్నవి)
(ప్రచారార్థము ప్రత్యేక తగ్గింపు ధర)

సంస్కృత మూలం : స్వర్గీయ పండిత విశ్వామిత్రజీ

వ్యాఖ్యాత : సంధ్యావందనం శ్రీనివాసరావు

ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమ ప్రచురణ**

# ప్రణవ స్తోత్రమ్

(రఘుపతి రాఘవ రాజారాం . . . . అనే బాణీలో పాడుకోవచ్చును)

1. **అనంత గుణగణ భూషిత** **ఓం**

(పరమేశ్వరుడు అనంత గుణములతో అలంకరింపబడినవాడు)

2. **శుద్ధ బ్రహ్మ పరాత్పర** **ఓం**

(శుద్ధుడు. అందరికంటె గొప్పవాడు. పెద్దవాడు)

3. **సబల బ్రహ్మ సునామక** **ఓం**

(బలవంతుడు. బ్రహ్మయను సుందర నామము కలవాడు)

4. **కాలాత్మక పరమేశ్వర** **ఓం**

(కాలమును నియమించువాడు. గొప్ప ఐశ్వర్యవంతుడు)

**ప్రళయానంతర సుస్థిత** **ఓం**

(ప్రళయంలోను తరువాత ఉండువాడు)

6. **ఈక్షిత సృష్టి విధాయక** **ఓం**

(కనబడుచున్న ఈ సృష్టిని చేయువాడు)

7. **వ్యాపక యజ్ఞ ప్రసారక** **ఓ౩మ్**
(సృష్టియను యజ్ఞమును అంతటా విస్తరింపజేయువాడు)

8. **లోకాఖిల గతిదాయక** **ఓ౩మ్**
(లోకాలన్నింటిని త్రిప్పువాడు)

9. **జగన్నియంతా పాలక** **ఓ౩మ్**
(జగత్తును నియమముగా పాలించువాడు)

10. **జనతా దుఃఖ ప్రభంజక** **ఓ౩మ్**
(ప్రజల దుఃఖములను తొలగించువాడు)

11. **భక్తప్రియ సుఖదాయక** **ఓ౩మ్**
(భక్తులను ప్రేమించి సుఖముల నిచ్చువాడు)

12. **సూర్యాదిక ద్యుతి ధారక** **ఓ౩మ్**
(సూర్యాది నక్షత్రములకు ప్రకాశమునిచ్చువాడు)

13. **పరమసహాయక ప్రియవర** **ఓ౩మ్**
(గొప్ప సహాయకుడు. ప్రియుడు. శ్రేష్ఠుడు)

14. నిత్య తృప్త సర్వాశ్రయ ఓ౩మ్
(జీవులను తృప్తిపరిచే సృష్టికి ఆశ్రయము)

అనంత గుణ గణ భూషిత ఓ౩మ్
శుద్ధబ్రహ్మా పరాత్పర ఓ౩మ్

15. జ్ఞానరూప సత్ప్రేరక ఓ౩మ్
(సత్యజ్ఞానమును ప్రేరేపించువాడు)

16. సకల ద్రవ్య వ్యాపక ఓ౩మ్
(సృష్టిలోని పదార్థాలన్నింటిలో వ్యాపించియున్నవాడు)

17. శ్రోత్రా దీంద్రియ శక్తిద ఓ౩మ్
(జ్ఞాన కర్మేంద్రియాలకు శక్తినిచ్చువాడు)

18. కర్మాశ్రిత ఫలదాయక ఓ౩మ్
(జీవులు చేయు కర్మలకు ఫలము నిచ్చువాడు)

19. అద్భుత తేజో బలయుత ఓ౩మ్
(అద్భుతమైన తేజస్సు బలములు కలవాడు)

20. శ్రేయః ప్రాప్తి సుసాధక ఓంమ్
(మోక్షప్రాప్తికి సాధనము)

21. హర్షిత మతి సందాయక ఓంమ్
(సుఖములనిచ్చు బుద్ధిని ప్రసాదించువాడు)

22. మాతృప్రేమ పరిపోషక ఓంమ్
(తల్లి ప్రేమతో అందరిని పెంచువాడు)

23. స్నేహార్ద్రిత పితృపాలక ఓంమ్
(స్నేహంతో దయతో తండ్రివలె పోషించువాడు)

24. వ్యాహృతి లోక విభాజక ఓంమ్
(విస్తారమైన సృష్టిని లోకాలుగా విభజించువాడు)

25. సకల బుద్ధి సిద్ధిప్రద ఓంమ్
(సకల జ్ఞానము నిచ్చువాడు)

26. వేద చతుష్టయ దాయక ఓంమ్
(ఋగ్, యజుస్, సామ, అథర్వ వేదాల నిచ్చువాడు)

అనంత గుణ గణ భూషిత ఓ౩మ్
శుద్ధబ్రహ్మ పరాత్పర ఓ౩మ్

27. అగ్న్యాదిక ఋషి పూజిత ఓ౩మ్
(అగ్ని వాయు ఆదిత్య అంగిరసులను ఆది ఋషులచే పూజింపబడువాడు)

28. సాధన సాధ్య సముచ్చయ ఓ౩మ్
(సాధ్యమునకు తగిన సాధనములను సమకూర్చువాడు. (మోక్షమునకు - యోగమును)

29. ప్రాణదక్ష సందాయక ఓ౩మ్
(జీవులకు ప్రాణముల నిచ్చువాడు)

30. ఇంద్ర బృహస్పతి నామక ఓ౩మ్
(ఇంద్రుడు, బృహస్పతి మున్నగు పేర్లతో పిలువబడువాడు)

31. ఋతుపరివర్తన కారణ ఓ౩మ్
(వసంతాది ఆఱు ఋతువులను కల్పించువాడు)

32. **ఋతుమూలక హిత దాయక** **ఓ౩మ్**
(ఋతువుల ద్వారా జీవులకు మేలు చేయువాడు)

33. **జ్ఞాన సూర్య విస్తారక** **ఓ౩మ్**
(జ్ఞానమనే సూర్యుని మానవులలో ప్రకాశింపజేయువాడు)

34. **సుర సంపూజిత సురవర** **ఓ౩మ్**
(దేవతలు పూజించే శ్రేష్ఠుడు - అధిదేవుడు)

35. **సత్సంకల్ప ప్రపూరక** **ఓ౩మ్**
(సత్యసంకల్పములను నెరవేర్చువాడు)

36. **ధర్మాధర్మ సుశిక్షక** **ఓ౩మ్**
(ధర్మము - అధర్మములను వేదముద్వారా బోధించువాడు)

37. **జన్మరహిత జన్మప్రద** **ఓ౩మ్**
(తాను శరీరమును ధరించక జీవులకు శరీరముల నిచ్చువాడు)

38. **దేవాదిక ఋణమోచక** **ఓ౩మ్**
(విద్వాంసులను ఋణములనుండి విడిపించువాడు)

అనంత గుణగణ భూషిత ఓంమ్

శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓంమ్

39. క్లేశ విముక్త విశేషణ ఓంమ్

(కష్టములు లేని పురుష విశేషుడు)

40. స్నాయు రహిత సుఖపూరక ఓంమ్

(నాడీ బంధనములు లేనివాడు. జీవులలో సుఖమును నింపువాడు)

41. దైహికరోగ నివారక ఓంమ్

(దేహసంబంధమైన రోగాలను రాకుండా చేయువాడు)

42. తనుపాలక దీర్ఘాయుద ఓంమ్

(శరీరాలను పోషించి దీర్ఘాయువునిచ్చువాడు)

43. ఆత్మికబల సందాయక ఓంమ్

(ఆత్మబలము నిచ్చువాడు)

44. మానవ లక్ష్య మహాశ్రయ ఓంమ్

(మానవులకు లక్ష్యము (పొందవలసినవాడు) మరియు గొప్ప ఆశ్రయము)

45. **నిత్య నిరంజన నిరుపమ** **ఓ౩మ్**
(భగవంతుడు నిత్యుడు, నిరంజనుడు, నిరుపముడు )

46. **భవభయ భంజన భేషజ** **ఓ౩మ్**
(ప్రపంచమునందలి భయమును నాశనమొనర్చే ఔషధము)

47. **ఆర్తత్రాణ పరాయణ** **ఓ౩మ్**
(కష్టములలోనున్న మంచివారిని రక్షించువాడు)

48. **అజ్ఞానాదిక రిపుహర** **ఓ౩మ్**
(అజ్ఞానము మున్నగు శత్రువులను హరించువాడు)

49. **దారిద్ర్యాది వినాశక** **ఓ౩మ్**
(పురుషార్థపరులైన వారి దారిద్ర్యమును పోగొట్టువాడు)

50. **పరమైశ్వర్య సుదాయక** **ఓ౩మ్**
(తన ఐశ్వర్యాదులతో జీవులకు సుఖముల నిచ్చువాడు)

**అనంత గుణగణ భూషిత** **ఓ౩మ్**
**శుద్ధ బ్రహ్మ పరాత్పర** **ఓ౩మ్**

51. **సర్వానంద సుసాధక** **ఓ౩మ్**
(పూర్ణానందమును పొందుటకు సాధనం)

52. **సామ్రాజ్యార్క ప్రసారక** **ఓ౩మ్**
(సామ్రాజ్య సూర్యుని విస్తరింపజేయువాడు)

53. **విశ్వ వినోదక విభువర** **ఓ౩మ్**
(విశ్వమును సకల సుఖములతో వినోదంగా సృష్టించి వ్యాపించి యుండువాడు)

54. **సద్బోధిత హృద్వర్ధక** **ఓ౩మ్**
(సత్యసంకల్పములను చేయు మనస్సును వృద్ధి చేయువాడు)

55. **నిర్మల నాయక శర్మద** **ఓ౩మ్**
(మల రహితుడు. నాయకుడు. ఆనందం నిచ్చువాడు)

56. **లోభాదిక రిపు నాశక** **ఓ౩మ్**
(లోభము మున్నగు శత్రువులను నాశనము చేయువాడు)

57. **తేజః ప్రద తేజోమయ** **ఓ౩మ్**
(సూర్యాది నక్షత్రములకు జీవులకు పూర్ణ ప్రకాశము నిచ్చువాడు)

58. ఓజః ప్రద ఓజోమయ ఓ౩మ్
(అనంతసామర్థ్యము కలిగియుండి పూర్ణ సామర్థ్యము నిచ్చువాడు)

59. శ్రద్ధాప్రద శ్రద్ధామయ ఓ౩మ్
(అనంత శ్రద్ధతో జీవులలో శ్రద్ధను కలుగజేయువాడు)

60. రసవాహక సర్వేశ్వర ఓ౩మ్
(పుష్పఫలాదులలో రసమును చేర్చుచు సృష్టిఅంతా ఐశ్వర్యంగాకలవాడు)

61. దాన సృష్టి సంచాలక ఓ౩మ్
(తాను సృష్టించిన జగత్తును జీవుల కొరకు దానమొనర్చి చక్కగా నడపువాడు)

62. రసభేదక సంవర్ధక ఓ౩మ్
(వృక్షాదులలోని రసమును సూర్యాదుల ద్వారా పైకి ఆకర్షింపజేయుచు వృద్ధిచేయువాడు)

అనంత గుణగణ భూషిత ఓ౩మ్
శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ౩మ్

63. **పాపనివారక మోక్షద** **ఓ౩మ్**
(పాపములు చేయకుండా నివారించి మోక్షము నిచ్చువాడు)

64. **మృత్యురూప సంశోధక** **ఓ౩మ్**
(మరణము ద్వారా జీవులను ఉద్ధరించేవాడు)

65. **చిత్ర విచిత్ర మహోతుధ** **ఓ౩మ్**
(సృష్టిలోని చిత్రవిచిత్రములన్నీ తెలిసినవాడు)

66. **సత్యసనాతన ధర్మద** **ఓ౩మ్**
(సత్యము సనాతనమైన వేదధర్మము బోధించేవాడు)

67. **హోమార్పిత హవిభేదక** **ఓ౩మ్**
(హోమంలో అర్పించిన ద్రవ్యముల ద్వారా సుగంధమును వెదజల్లువాడు)

68. **సభ్యసభా ప్రతిభాప్రియ** **ఓ౩మ్**
(ప్రతిభావంతులైన సభ్యుల సభకు ప్రియుడు)

69. **విస్తృత శాంతి విధాయక** **ఓ౩మ్**
(శాంతిని విస్తరింపజేయువాడు)

70. **వరుణ ప్రజాపతి ప్రేరక** **ఓ౩మ్**
(వరుణుడు. ప్రజాపతి. ప్రేరణ నిచ్చువాడు)

71. **స్థావర జంగమ రక్షక** **ఓ౩మ్**
(స్థావరములను (కదలనివి) జంగమములను
(కదలునవి) రక్షించువాడు)

72. **విద్వజ్జన మతి ప్రేరక** **ఓ౩మ్**
(విద్వాంసుల బుద్ధిని వికసింపజేయువాడు)

73. **విక్రమ విష్ణు విరాడసి** **ఓ౩మ్**
(విక్రముడు. విష్ణువు . విరాట్ మున్నగు నామములు కలవాడవు)

74. **దాన రహిత నరనాశక** **ఓ౩మ్**
(దానము చేయని ప్రజలను నాశనము చేయువాడు)

**అనంత గుణగణ భూషిత** **ఓ౩మ్**
**శుద్ధ బ్రహ్మ పరాత్పర** **ఓ౩మ్**

75. **త్యాగయుక్త నర భద్రద** **ఓ౩మ్**
(త్యాగము చేయు నరులను రక్షించువాడు)

76. **మన్యురూప మన్యుప్రద** **ఓం**
(దుష్టులపైన దుష్టకార్యములపైన క్రోధము కలిగి, మానవులకును అట్టి మన్యువును ఇచ్చువాడు)

77. **వీర్యరూప వీర్యప్రద** **ఓం**
(అనంత పరాక్రమముతో మానవులకు పూర్ణ పరాక్రమము నిచ్చువాడు)

78. **సహనరూప సహదాయక** **ఓం**
(అనంత సహనముతో మానవులకు సహనము నిచ్చువాడు)

79. **అచల రూప సంచాలక** **ఓం**
(తానుకదలక జగత్తునంతటినీ నడిపించువాడు)

80. **రుద్ర భీమ భయవాహక** **ఓం**
(రుద్రుడు. భీముడు. భయంకరుడు)

81. **సజ్జన సమ్మత సౌఖ్యద** **ఓం**
(సజ్జనులకిష్టమైన సుఖముల నిచ్చువాడు)

82. **వర్ణ చతుష్టయ స్థాపక** **ఓం**
(బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణములను ఏర్పరచినవాడు)

83. సర్వ న్యూన సంపూరక ఓౕమ్
(సృష్టిలో ఏలోటులేకుండా చేయువాడు)

84. విద్వేషాదిక భంజక ఓౕమ్
(ద్వేషాదులను నాశనము చేయువాడు)

85. సర్వమిత్ర సంపాదక ఓౕమ్
(అందరికీ మిత్రుడు)

86. సృష్టి స్థితి లయ కారక ఓౕమ్
(సృష్టిని చేసి పోషించి నాశనము చేయువాడు)

అనంత గుణ గణ భూషిత ఓౕమ్
శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓౕమ్

87. క్షోభరహిత నభ నామక ఓౕమ్
(దుఃఖము లేనివాడు, ఆకాశనామముకలవాడు)

88. మంగళ మూల మయోభవ ఓౕమ్
(మంగళ కారకుడు)

89. **శంకరరూప మయస్కర** **ఓ౩మ్**

(శంకరుడు. మయస్కరుడను పేర్లతో పిలువబడువాడు)

90. **సృష్టి మయా వసు రసవతి** **ఓ౩మ్**

(నేను చేసిన ఈ సృష్టి ఐశ్వర్య, రసాదులతో కూడినది)

91. **సత్పథ ధర్మ పురోహిత** **ఓ౩మ్**

(ధార్మికులను సత్యమార్గములో నడిపించువాడు)

92. **నాశ నివారక స్వస్తిద** **ఓ౩మ్**

(నాశమునుండి తప్పించి శుభములనిచ్చువాడు)

93. **సకల యజ్ఞ స్వీకారక** **ఓ౩మ్**

(శ్రేష్ఠ కర్మలన్నింటినీ అనుమతించువాడు)

94. **ఉక్షిత రక్షక శిక్షక** **ఓ౩మ్**

(శుభకర్మలాచరించువారిని రక్షించువాడు.
దుష్టులను శిక్షించువాడు

95. **విశ్వరూప విశ్వావసు** **ఓ౩మ్**

(విశ్వమనెడు ఈ సమస్త ఐశ్వర్యము పరమేశ్వరునిది)

96. **విశ్వమిత్ర వైశ్వానర ఓం**
(అందరికి మిత్రుడు. ఈశ్వరుడు)

97. **పుణ్య పురూత మపూరుష ఓం**
(జీవునివలె పుణ్య - పాపకర్మలు చేయువాడు కాడు)

98. **పాహి నిరంతర పూషణ ఓం**
(సజ్జనులను ఎల్లప్పుడు రక్షించి పోషించువాడు)

**అనంత గుణగణ భూషిత ఓం**
**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓం**

99. **పాహి ప్రవాహణ ప్రభువర ఓం**
(అందరికీ ప్రభువైన ఓ ఈశ్వర మమ్ము రక్షించు)

100. **అద్భుత మిత్ర కృపాకర ఓం**
(గొప్పమిత్రుడు, కృపను జూపువాడు)

101. **మిత్ర రూప వ్రతపాలక ఓం**
(స్నేహ వ్రతమును పాలించువాడు)






102.నిశ్చిత మిత్ర నిరాశ్రయ ఓంమ్
(సదా మిత్రుడు, ఆశ్రయము)

103.అధమోద్ధారక చిన్మయ ఓంమ్
(దీనుల నుద్ధరించువాడు. అనంత జ్ఞానము కలవాడు)

104.సత్య సుఖాత్మక సర్వద ఓంమ్
(సత్యసుఖముతో కూడినవాడు. సృష్టిని దానము చేయువాడు)

105.నిర్గుణ రూప నిరామయ ఓంమ్
(రూపరస గంధాది గుణములు, అజీర్ణాది రోగములు లేనివాడు)

106.ఆనందామృత వర్షక ఓంమ్
(ఆనందమనే అమృతము నిచ్చువాడు)

107.గణనాయక గణపాలక ఓంమ్
(దేవతాది గణములకు నాయకుడు - పోషకుడు)

108.మర్మాచ్ఛాదక విభువర ఓంమ్
(జీవనమునకు కారణములైన ప్రాణాదులను కప్పియుంచువాడు)

అనంత గుణ గణ భూషిత ఓంమ్
శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓంమ్
(ఇతి అష్టోత్తర శత ప్రణవ నామాని)




# 108 ఈశ్వర నామములు

1. ఓమ్
2. ఖమ్
3. బ్రహ్మము
4. అగ్ని
5. మనువు
6. ప్రజాపతి
7. ఇంద్రుడు
8. ప్రాణము
9. బ్రహ్మ
10. విష్ణువు
11. రుద్రుడు
12. శివుడు
13. అక్షరుడు
14. స్వరాట్
15. కాలాగ్ని
16. దివ్యుడు
17. సుపర్ణుడు
18. గరుత్మంతుడు
19. మాతరిశ్వుడు
20. భూమి
21. విరాట్
22. విశ్వుడు
23. హిరణ్యగర్భుడు
24. వాయువు
25. తైజసుడు
26. ఈశ్వరుడు
27. ఆదిత్యుడు
28. ప్రాజ్ఞుడు
29. మిత్రుడు
30. వరుణుడు
31. అర్యముడు
32. బృహస్పతి
33. ఉరుక్రముడు
34. సూర్యుడు
35. పరమాత్మ
36. పరమేశ్వరుడు
37. సవిత
38. దేవుడు. దేవి
39. కుబేరుడు
40. పృథివి
41. జలము
42. ఆకాశము
43. అన్నము
44. అన్నాదుడు
45. వసువు
46. నారాయణుడు
47. చంద్రుడు
48. మంగళుడు
49. బుధుడు
50. శుక్రుడు
51. శనైశ్చరుడు
52. రాహువు
53. కేతువు
54. యజ్ఞము
55. హోత
56. బంధువు
57. పిత
58. పితామహుడు
59. ప్రపితామహుడు
60. మాత
61. ఆచార్యుడు
62. గురువు
63. అజుడు
64. సత్యము
65. జ్ఞానము
66. అనంతుడు

67. అనాది
68. సత్
69. చిత్
70. ఆనందుడు
71. నిత్యుడు
72. శుద్ధుడు
73. బుద్ధుడు
74. ముక్తుడు
75. నిరాకారుడు
76. నిరంజనుడు
77. గణేశుడు
78. గణపతి
79. విశ్వేశ్వరుడు
80. కూటస్థుడు
81. శక్తి
82. శ్రీ
83. లక్ష్మి
84. సరస్వతి
85. సర్వ శక్తిమంతుడు
86. న్యాయకారి
87. దయాళువు
88. అద్వైతుడు
89. నిర్గుణుడు
90. సగుణుడు
91. అంతర్యామి
92. ధర్మరాజు
93. యముడు
94. భగవంతుడు
95. పురుషుడు
96. విశ్వంభరుడు
97. కాలుడు
98. శేషుడు
99. ఆప్తుడు
100. శంకరుడు
101. మహాదేవుడు
102. ప్రియుడు
103. స్వయంభువు
104. కవి
105. అత్రా
106. ఆత్మ
107. అచిన్త్యుడు
108. సర్వ జగత్కర్త

*PRINTED AT* PRINTSHOP. Sec'bad.

283/0



# అహల్య రాయిగా మారలేదు

హిందీమూలం :

అమరస్వామి సరస్వతి

తెలుగు సేత :

సంధ్యావందనం శ్రీనివాసరావు

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

ప్రతులు : 1000 వెల : 2 రూపాయలు

ఓ3మ్

# పరిచయం

శ్రీరాముడు శాపగ్రస్తురాలై రాయిగా మారిన అహల్యను తన కాలితో తాకగానే తిరిగి అహల్య స్త్రీగా మారినదని ఒక కట్టుకథ ఉంది. హిందువులు శ్రీరాముని దేవుని అవతారమని చెప్పుటకే ఈ కట్టుకథను కల్పించారు. శ్రీరాముని దేవుడంటే తప్పులేదు. కానీ ఈ చరాచర జగత్తునంతా చేసి పోషించి లయంచేసే సృష్టికర్త ధర్త హర్త అనుకుంటే మాత్రం పొరపాటు. శ్రీరాముడు ఏక పత్నీవ్రతుడు, పితృవాక్య పరిపాలకుడు, వేదవిదుడు. అందువలన ఆయనను దేవుడు - దివ్యగుణములు కలవాడు అంటే దోషమేమీ లేదు. మానవులలోనే విద్వాంసులు, దాన ధర్మములు చేయువారు, వేద విద్యలను నేర్పు ఆచార్యులు, ధర్మబద్ధంగా ప్రజాపాలన చేయు రాజులు మున్నగు వారు కూడా దేవతలనబడతారు. అందువలన శ్రీరాముడొక దేవుడు. సృష్టికర్తయైన పరమేశ్వరుడు మాత్రం కాడు.

మహాభారత యుద్ధానికి పూర్వమే వేద సిద్ధాంతాలు కనుమరుగైన కారణంగా మానవ సమాజంలో అనేక దురాచారాలు ప్రబలం కాసాగాయి. మన ప్రాచీన ఋషులను, మహాత్ములను నిందించటం, అవహేళన చేయటం కూడా అప్పటినుండే ఆరంభమైనది. ఋషులు, ఋషి పత్నులపై నిందలు వేస్తూ మన ప్రాచీన వైదిక సంస్కృతి - సభ్యతలను సర్వనాశనం చేసే ప్రయత్నంలో ఒక భాగమే ఈ అహల్య - శాపం కట్టు కథ. బుద్ధిమంతులు ఆలోచించి ఇటువంటి నిందలను తిరస్కరించాలి.

**సంధ్యావందనం శ్రీనివాసరావు**



# అహల్య రాయిగా మారలేదు

తులసీరామాయణంలో గౌతమ ఋషిపత్నియైన అహల్యా గౌతమ ఋషి శాపంతో రాయిగా మారినట్లు ఒక కట్టు కథ ఉంది. శ్రీరాముడు రాతిని కాలితో తాకగానే ఆయన పాదధూళి అంటుకొని ఆ రాయి మళ్ళీ స్త్రీగా మారి స్వర్గానికి ఎగిరిపోయింది. చూడండి

గౌతమ నారీ శాపవశ, ఉపల దేహ ధరి ధీర,
చరణ కమల రజ చాహతీ, కృపా కరహు రఘువీర.

గౌతమ ఋషి పత్ని అహల్య శాపం వలన రాయిగా మారింది. ఓ రామా ! నీ పాద ధూళిని కోరుతోంది. నీవామెను కరుణింపుమని విశ్వామిత్ర ఋషి శ్రీరామునితో అనెను.

శ్రీరాముడు వనవాసమున కెళ్ళుచున్నపుడు గంగానదిని దాటుటకై నావ అవసరమైనది.

మాంగీ నావ న కేవట ఆనా, కహా తుమ్హార మర్మ మై జానా ..... తులసీ రామాయణం)

శ్రీరాముడు నదిని దాటుటకు నావనడుపువానిని (ముల్లాహ) నావను తెమ్మనగా అతడిట్లనెను - " చరణ్ కమల్ రజ్ కహం సబ్ కహ ఈ. మానుష్ కరని మూరి కఛు అహఈ".

ఓ రామా ! మీ రహస్యం నా కర్థమైంది. మీ పాద పద్మముల ధూళి మానవులను తయారుచేసే ఔషధమని అంతా అంటుంటారు. మీ పాద ధూళిని తాకగానే రాయి సుందర స్త్రీగా మారింది. రాయి కంటె కర్ర గట్టిది కాదు. రాయే స్త్రీగా మారినపుడు నా కర్రనావ స్త్రీగా మారదా ! ? ఈ నావకూడా ఋషి పత్నిగా మారి పైకెగిరి పోతే నాగతేమిటి? నేనీనావతోనే నాకుటుంబాన్ని పోషించుకుంటున్నాను. నాకు వేరే పనేదీ రాదు. అందుకని మహారాజా ! మీరీ గంగానదిని నా నావపైనే దాటాలనుకుంటే, ముందు నేను మీ పాదాలను నీటితో కడగటానికి అనుమతించండి. కాళ్ళు కడగటంతో మీ పాదాలకంటిన ధూళి పోతుంది. కనుక నా నావ ఎగిరి పోకుండా ఉంటుంది !

ఈ కథ వలన మనకు తెలిసేదేమంటే - శ్రీరాముని పాదాలలో ఆ శక్తి లేదు. ఆయన పాదాలకంటియున్న ధూళి (మట్టి) కాచమత్కారమున్నది. దీనిపైన రహీంకవి దోహ ఒకటుంది. అది

ధూరి ధరత గజ శీశ పర్.......

రహీం కవిని ఒకరిలా అడిగాడు - "రహీం ఈ ఏనుగు తన తలపై దుమ్మెందుకు పోసుకుంటున్నది? అని. అందుకు రహీం : గౌతమముని పత్ని అహల్యా తరించిన ధూళి కొరకు ఈ ఏనుగు వెదుకుతూ తిరుగుతోంది. ఆ దుమ్ము ఎక్కడైనా దొరికితే తాను కూడా తరించవచ్చని దాని ఆశ ! అన్నారు.

అహల్య రాయిగా మారటం. అహల్య శ్రీరాముని పాదధూళి తాకగానే స్త్రీగా మారటం వంటి దేమీ వాల్మీకి రామాయణంలో ఎక్కడా లేదు. అచ్చటిలా ఉంది -

విశ్వామిత్రం పురస్కృత్య ఆశ్రమం ప్రవివేశ హ । (12)
దదర్శ చ మహాభాగాం, తపసా ఘౌతిత ప్రభామ్ । (13)
రాఘవౌస్తు తదా తస్యాః, పాదౌ జగృహతుర్ ముదా । (17)
పాధమర్ఘ్య తథాతిథ్యం, చకార సు సమాహితా । (18)
(వాల్మీకి రామాయణం - బాలకాండ - 49వ సర్గ)

**విశ్వామిత్ర ఋషితో రామలక్ష్మణులు గౌతమ ఋషి ఆశ్రమమును సందర్శించుట.**

ఆశ్రమంలో ప్రవేశిస్తుండగా మహాభాగ్యశాలిని యైన అహల్య తన తపోబలంతో దేదీప్యమానంగా ప్రకాశించుచున్నది.

శ్రీరామలక్ష్మణులు ఎంతో ఆనందంతో అహల్యయొక్క పాదములు రెండింటిని స్పర్శించిరి. (శ్రీరాముడు తన పాదాలతో అహల్యను తాకలేదు) అహల్య ఆ ఇరువురు అన్నదమ్ములను ఎంతో ఆదరంతో అర్ఘ్యపాద్యాదులను (కాళ్ళు ముఖం చేతులు కడుగుకొనుటకు నీళ్ళు) త్రాగుటకు (ఆచమనం) నీళ్ళిచ్చి అతిథి సత్కారమును చేసెను. వాల్మీకి రామాయణంలో అహల్య రాయిగా మారటం శ్రీరాము డారాతిని తాకగానే అది స్త్రీగా మారటం వంటివేవీ లేవు.

గౌతమ ఋషి శాపంతో అహల్య రాయిగా మారెనను మాట వాల్మీకి రామాయణంలో లేదు. ఇందుకు విరుద్ధంగా ఇచ్చట ప్రకరణం ఇలా ఉంది. చూడండి -

'తపసా ద్యోతిత ప్రభా' తపస్సు చేస్తున్న అహల్య అద్భుత తేజస్సుతో ప్రకాశిస్తోంది. అని మీరు రామాయణంలోని వాక్యాన్ని చదివే ఉంటారు. శ్రీరాముడామెను దర్శించి అన్నదమ్ములిరువురు ఆమె పాదాలను స్పర్శించిరి.

రామాయణంలో అహల్యా ఇంద్రుల జారకర్మ (వ్యభిచారం) ను గురించి వ్రాసి ఉంది. కానీ రామాయణ కథను చెప్పే భాగవతులు దీనిని రామాయణంలో కల్పినట్లుగా భావిస్తున్నాను. కలపటానికి కారణాలివి -

గౌతమ - అహల్య - ఇంద్రులను గూర్చిన ఈ కథ శతపథ బ్రాహ్మణంలో రూపకాలంకారంలో ఉన్నది-

అహల్యాపతి గౌతముడు. ఇంద్రుడు - జారుడు. చూడండి.

**'రాత్రిరహల్యా కస్మా దహర్దినం లీయతే స్యాం తస్మా ద్రాత్రి రహల్యోచ్యతే'**

రాత్రి 'అహల్య'. దినమునకు 'అహః' అని పేరు. " అహల్యా" "అహః" దినము దీనిలో లయమగును (కలిసిపోవును) కనుక రాత్రికి "అహల్యా" అని పేరు. గౌతముడు - చంద్రుడు. చంద్రుడు రాత్రివేగంగా వెళ్ళుతున్నట్లు కనబడతాడు కనుక - " గచ్ఛతి ఇతి గౌ"నడచువాడు - చంద్రుడు-"గౌ" అనబడును. వేగంగా వెళ్ళును. కావున "గౌతముడు" అనబడతాడు. చంద్రుని రాత్రికి పతి అందురు. అందువలన చంద్రుని "నిశా-పతి" అంటారు. నిశా అంటే రాత్రి. చంద్రునకు రాకేశ్ అని కూడా పేరు. రాత్రికి రాకా అనిపేరు. పూర్ణిమకు కూడా రాకా అని పేరు. చంద్రుడు లేని రాత్రి 'విధవ'వలె కనబడుతుంది. చంద్రునితో కలిసి ఉన్న రాత్రి శోభాయమానంగా ప్రకాశిస్తూ అంటే సౌభాగ్యవతియైన స్త్రీలా కనబడుతుంది. అందువలన చంద్రుడు అంటే గౌతముడు రాత్రి అంటే అహల్యకు పతి.

సూర్యుడు ఇంద్రుడు. సూర్యుడు రాత్రిని నశింపజేస్తాడు. (లేకుండా చేస్తాడు) అంటే బలహీనపరుస్తాడు. ఇది జారకర్మ. అందువలన ఇంద్రుడనగా సూర్యుడు, అహల్య అనగా రాత్రితో వ్యభిచరించును. సూర్యోదయం కాగానే రాత్రి బలహీనపడుతూ పడుతూ పూర్తిగా నశించిపోతుంది.ఇదొక విజ్ఞానంతో కూడి యున్న సుందర రూపకాలంకారం.

దీనిని అర్థం చేసుకోకుండా గౌతమ ఋషిపత్ని అహల్యతో ఇంద్రుడు జారకర్మ - వ్యభిచరించాడని పురాణాలలో వ్రాశారు. రామాయణంలో గౌతమ ముని పత్ని అహల్యయొక్క చరిత్రకు సంబంధించిన వర్ణన ఉంది. దానితో బ్రాహ్మణగ్రంథంలోని ఈ రూపకాలంకారాన్ని జోడించి చరిత్ర భ్రష్టు పట్టించారు - నాశనం చేశారు. ఇంద్రుడు - అహల్యకు మధ్య అబద్ధపు వ్యభిచారదోషాన్ని కల్పించారు.

ఈ విధంగా శబ్దాలకు (అనర్థాలను) తప్పుడు అర్థాలను కల్పనచేసి చేసి కథలు చెప్పే మన పౌరాణికులు మన చరిత్ర గాధలన్నింటిని నాశనం చేశారు. రామాయణంలో అనేక చోట్ల తమ ఇష్టం వచ్చిన కల్పిత కథలున్నాయి. వీనితో వాస్తవాలు మరుగున పడ్డాయి.

నేటి ఆధునిక యుగంలో ప్రతి విషయాన్ని తర్కబుద్ధితో ఆలోచించి తెలుసుకోవాలి. ఇప్పుడు ప్రాతకాలం నాటి మాటలు- "వేపచెట్టెక్కిందని పండితుల వారంటే. భక్తబృందం సత్యం మహరాజ్" అన్నారు. ఇటువంటి భ్రమలు కలిగించే అబద్ధపు కథలు చదివి చదివి నేటి యువతీ - యువకులు రామాయణ, మహాభారత ఇతిహాసాలకు తిలాంజలులివ్వటానికి తయారౌ తున్నారు. కనుక విద్వాంసులంతా ప్రతివిషయాన్ని సత్యంతో పరీక్షించి యుక్తి-యుక్తంగా వ్రాయాలి. మన దేశ చరిత్ర, ధర్మగ్రంథాలలో ఎటువంటి దోషాలూ రానివ్వరాదు.

**ఒక ధర్మము, ఒక భాష, ఒక లక్ష్యము భారతవాసుల కేర్పడనంతవరకు భారత దేశమునకు పూర్ణహిత మేర్పడజాలదు. ఉన్నతియు జరుగదు.**

**(మహర్షి దయానంద సరస్వతి)**

## మహర్షి దయానంద సరస్వతికి శ్రద్ధాంజలి)

శ్రీ శంకరాచార్యులు తరువాత దయానంద స్వామి కంటె అధిక సంస్కృతజ్ఞుడు, గంభీర తత్త్వవేత్త, ఆశ్చర్య జనక వక్త, కురీతులను నిర్భయముగా ఖండించిన వ్యక్తి మరొకరెవ్వరు భారత దేశమునకు లభింపలేదు.

**మేడమ్ బ్లావట్ స్కీ**

ఆధునిక భారత మహా మార్గ నిర్మాత స్వామీ దయానంద సరస్వతి. భగవంతుని పట్ల భక్తి కలిగిన మానవునికి సేవ చేయగల నిరాడంబర హేతుబద్ధ జీవితాన్ని హిందువులు గపటానికి ఉద్దేశించిన మార్గాన్ని సుగమం చేసినాడు. సత్యాన్ని, కృతనిశ్చయ ధైర్యాన్ని సుస్పష్టంగా దర్శించి ఆయన మన ఆత్మ గౌరవం కోసం, శక్తివంతమైన మనో జాగృతి కోసం కృషిచేశారు.

**రవీంద్రనాథ్ టాగోర్**

దయానందస్వామి ఏకేశ్వరవాది. వేదముల ఆధారంగా తన సిద్ధాంతముల నంగీకరించినవాడు. ప్రగతిని సమర్థించువాడు. దేశోద్ధారకుడు

**మోనియర్ విలియమ్స్**

# గాయత్రీ ఆశ్రమ ప్రచురణలు

గోమాత, వైదిక వైజ్ఞానిక సంస్కృతి, మానవ ధర్మము, గాయత్రీ మహిమ వైదిక క్రాంతి పథం, చతుర్దశ భువనములు, అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము, యజ్ఞోపవీత వైశిష్ట్యము, జనీ - జన్మభూమి, దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణి స్త్రీ), యుగపురుషుడు శ్రీకృష్ణుడు, పురుషోత్తముడు శ్రీరాముడు, మహర్షి మనువుపై విరోధమెందుకు ?, వేదములలో విజ్ఞాన బీజాలు, ధర్మవీర్ పం. లేఖరాం, వైదిక వివాహ వైశిష్ట్యము, అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ, మాతా పుత్రికల జ్ఞాన చర్చ, బ్రహ్మచర్య విజ్ఞానము, వైదిక అర్థనీతి, దయానందుని ఆదర్శ రాజ్యము, వైదిక సంధ్యాగ్నిహోత్ర విధి, దైనిక అగ్నిహోత్రవిధి, ది గ్రేట్ గాయత్రీ, శాంతి ప్రార్థన, చాణక్యనీతి, శ్రీ దయానంద హృదయము, ప్రణవ స్తోత్రమ్, శ్రీమతి లక్ష్మీదేవి ప్రేరణాత్మక జీవనం, లక్ష్మీసూక్తం, వేదాలలో అప్సరస గంధర్వులు, వేదాలలో జల చికిత్స, సత్యధర్మ విచారము.

సత్యమును
తెలుసుకోదలచినవారు
# సత్యార్థ ప్రకాశాన్ని
చదవండి



PRINTSHOP - 781 2904




అనుష్ఠానము : గాయత్రీ మంత్రము జపమంత్రము. ప్రతి నిత్యము ఉదయము, సాయంత్రము సంధ్యా సమయాలలో శుద్ధులై, ఏకాంతమున ఆసీనులై హృదయస్థానమున మనస్సును నిలిపి పరమేశ్వరుని సచ్చిదానంద స్వరూపమును ధారణ చేయుచు శక్తికొలది (108 లేక అంతకన్న ఎక్కువ పర్యాయములు) గాయత్రీ జపము చేయవలెను.

ఈ మంత్రజపము వర్ణ, కుల,మత, ప్రాంత భేదములేక మానవ మాత్రులందరు చేయవచ్చును. స్త్రీలు కూడ నిస్సంకోచముగా చేయవచ్చును. (కౌసల్య, సీత మొ॥ వారు చేసిరి). విద్యార్థులు చేయుట చాలా మంచిది. అందువలన వారి బుద్ధి వికసించును)

దీనివలన సూక్ష్మ పదార్థములైన ప్రకృతి, ఆత్మ పరమాత్మల, జ్ఞానము కలుగును. జీవాత్మలమైన మన స్వస్వరూపము, పరమాత్మ తత్త్వము, వేదములోని భౌతిక, ఆధ్యాత్మిక విజ్ఞానము చక్కగా అవగత మగును. కర్తవ్యము బోధపడును. సత్కర్మలయందు ప్రేరణ కలుగును. జీవితము ధన్యమగును.


